# పోచంపాడు ప్రాజెక్టు మహారాష్ట్ర అభ్యంతరం

## ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రకటన

('ఆంధ్రపత్రిక' ప్రతినిధి) హైదరాబాద్, ఆగస్టు 8: పోచంపాడు ప్రాజెక్టు పరియికిరి కొన్ని వర్గాలు ఆరోపిస్తున్నట్లు, ఆంధ్రప్రదేశ్ అవతరణ అనంతరం తగ్గించడం జరగలేదని ప్రభుత్వం ఒక పత్రికా ప్రకటనలో తెలియజేస్తున్నది.

ప్రాజెక్టు క్రింది ఆయకట్టు పూర్తి అభివృద్ధి చెందితే నీరు కల్పించే విధంగా ప్రాజెక్టు నిర్మాణం అమలు జరపబడుతున్నది. ఈ ప్రాజెక్టు మొత్తం నీటిశక్తి 112 శతకోటి ఘనపుటడుగుల నీరు. ఈ శక్తి 1956 జూన్ పథకంలో ఉద్దేశించిన 257 శతకోటి ఘనపుటడుగుల నీరు వినియోగానికి సరిపోతుంది.

ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు జరిగినప్పుడు మహేశ్వరం, కావలిగుండాల వద్ద రెండు డాంలుగాక పోచంపాడులో ఒక డాం నిర్మించే విధంగా 1956 జూన్‌లో ఒక ప్రాజెక్టు నివేదిక తయారు చేయబడిందని ప్రభుత్వం ఆ పత్రికా ప్రకటనలో వివరించింది. 257 శతకోటి ఘనపుటడుగుల నీరు వినియోగం నిమిత్తం 16.2 లక్షల ఎకరాలకు నీటి సదుపాయం కల్పించడానికి పోచంపాడు రిజర్వాయరునుంచి దక్షిణ కాల్వ ద్వారా ఆ ప్రాజెక్టులో చేర్చబడింది.

పాత హైదరాబాద్ రాష్ట్ర ప్రభుత్వం చేసిన ప్రతిపాదనం ప్రాతిపదికగా, దక్షిణ కాల్వ క్రింద 18.56 లక్షల ఎకరాలకు, ఉత్తర కాల్వ క్రింద 1,8[illegible] లక్షల ఎకరాలకు నీరు లభింపజేయడానికి 1958—59లో పథకం సవరించబడింది. పోచంపాడు వద్ద 560 శతకోటి ఘనపుటడుగుల నీరు లభించగలదని, ఇందులో ప్రాజెక్టుతో 257 శతకోటి ఘనపుటడుగుల నీరు లభ్యం కాగలదని అంచనా వేయబడింది. కాని మహారాష్ట్ర ఈ అంచనాకు అంగీకరించలేదు.

1960లో అంతర్రాష్ట్ర సమావేశం జరిగినప్పుడు, నీటి లభింపును గూర్చి, గోదావరి జలాలపై 1951లో జరిగిన అంతర్ రాష్ట్ర ఒప్పందంలో అంగీకరించిన కేటాయింపులను గూర్చి ఎగువ రాష్ట్రాలు వివాదం తెచ్చాయి. అందువల్ల ఈ అంశాలను పరిశీలించి, నివేదిక సమర్పించడానికిగాను కేంద్రప్రభుత్వం కృష్ణా—గోదావరి సంఘాన్ని ఏర్పాటు చేసింది.

పోచంపాడు ప్రాజెక్టును మూడు దశలుగా అమలుపర్చాలని మొదటి దశలో 3,40,000 ఎకరాలు, రెండవ దశలో 15,55,000 ఎకరాలు, మూడవ దశలో 3 లక్షల ఎకరాలు సాగునీరు పారుదల కావడానికి వీలుగా (మొత్తం 21,95,000 ఎకరాలు) ఈ నిర్మాణం జరగాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ సంఘానికి ప్రతిపాదించింది.

పోచంపాడు ప్రాజెక్టు మొదటి దశ 66 శతకోటి ఘనపుటడుగుల నీరు వినియోగానికి ఉపకరించే నిల్వ పథకంగా పరిశీలించవచ్చునని సంఘం అప్పుడు సూచించింది. ఆ విధంగా మొదటి దశకు కేంద్రప్రభుత్వం మంజూరు ఇచ్చింది. 66 శతకోటి ఘనపుటడుగుల నీరు వినియోగానికి వీల్లైన నిల్వ ప్రాజెక్టుగా, ఆ తర్వాత అవసరమైతే ఈ నిల్వ శక్తిని పెంచడానికి వీలుగా ప్రాజెక్టు నిర్మాణం ప్రారంభించడానికి కేంద్రం ఆంధ్రకు అనుమతి ఇచ్చింది.

## భారత్, రష్యాల మధ్య కొత్త వాణిజ్య ఒప్పందం

### మాస్కోలో 11న చర్చలు

న్యూఢిల్లీ, ఆగస్టు 8: భారత, రష్యాల మధ్య 1971 నుంచి 75 వరకు దీర్ఘకాలిక వాణిజ్య ఒప్పందం గురించి ప్రథమ ఘట్ట సంప్రదింపులు జరిపేందుకు తొమ్మిదిమంది సభ్యులుగల అధికార ప్రతినిధివర్గం విదేశవాణిజ్య మంత్రిత్వ శాఖ సంయుక్త కార్యదర్శి శ్రీ పి.సి. అలెగ్జాండర్ నాయకత్వాన ఈ నెల 10వ తేదీన మాస్కో బయలుదేరి వెడుతున్నది.

ప్రస్తుతం ఉన్న అయిదేళ్ల ఒప్పందం 1970 డిసెంబరు 31 నాటికి సమాప్తమవుతుంది.

భారత, రష్యాల మధ్య వాణిజ్యం పెరుగుదల ఏ దామాషాన పెరగాలో, తయారైన భారతీయ వస్తువుల ఎగుమతులను ఏమేరకు విస్తరించ వచ్చునో, రష్యా నుంచి ఏయే సరకులను భారత దిగుమతి చేసుకోవాలో మొదలైన అంశాలపై ఈ ప్రతినిధి వర్గం మాస్కోలో చర్చలు జరుపుతుంది.

1969లో రష్యాకు భారత నుంచి 155 కోట్ల రూపాయల విలువ గల వస్తువులు ఎగుమతి కాగలవని అంచనా.

భారత నుంచి ఇంత వరకు పొగాకు, తేయాకు, కాఫీ, జీడిపప్పు మొదలైన సంప్రదాయకమైన సరకులే ఎగుమతి అవుతున్నవి. ఇకనుంచి సైకిళ్ళు, కుట్టు మిషన్లు, విద్యుత్ పంకాలు, టైప్ రైటర్లు, పారిశ్రామిక యంత్రాలు ఉక్కు గొట్టాలు, ట్యూబుల ఎగుమతులను పెంచాలని భారత సంకల్పించింది.



అమెరికా అధ్యక్షుడు శ్రీ రిచర్డ్ నిక్సన్ జులై 31న ఢిల్లీ విచ్చేసినప్పుడు రాష్ట్రపతి భవన్‌లో విందు జరిగినప్పటి చిత్రం

## లోక్‌సభలో సహాయ మంత్రి జనసంఘ్ సభ్యుల వాగ్యుద్ధం

న్యూఢిల్లీ, ఆగస్టు 8: తన అభిప్రాయాలు ఆకాశవాణి ద్వారా ప్రసారం కావించడంలో కాంగ్రెసు కమ్యూనిస్టుల మధ్య లాలూచీ కలదని నిన్న లోక్‌సభలో శ్రీ బలరాజ్ మదోక్ అన్నప్పుడు సమాచార సహాయ మంత్రికి ఆయనకు మధ్య వాగ్వివాదం జరిగింది.

శ్రీ మదోక్ ఆరోపణ తుంటరిగా ఉన్నదని శ్రీ గుజ్రాల్ అన్నారు.

మంత్రి తన వ్యాఖ్యానాన్ని ఉపసంహరించుకోవాలని స్వతంత్ర పార్టీ సభ్యుడు శ్రీ ఎన్. జి. రంగా కోరారు. ఒకవైపు కాంగ్రెసు సభ్యులు ధ్వనిచేయగా మరొక వంక స్వతంత్ర జనసంఘం సభ్యులు తప్పట్లు చరిచారు.

మంత్రి సమాధానంలో సరయిన భాషను ఉపయోగించాలని శ్రీ మదోక్ కోరారు. ఆయన ప్రయోగించిన మాటలే ఆయనకు అప్పజెప్పుతానని శ్రీ గుజ్రాల్ అన్నారు.

తిరిగి అదే విధంగా సమాధానం చెపుతానని మంత్రి అనడం సరయినదేనా అని శ్రీ రంగా ప్రశ్నించారు.

బ్యాంకుల జాతీయంసమస్యపై తమఅభిప్రాయాలు వ్యక్త పరచడానికి ఆకాశవాణి వారుతమనుఆహ్వానించలేదనిస్వతంత్ర జనసంఘ సభ్యులు పేర్కొన్నారు.

మంత్రి సమాధానం కూడా తుంటరిగా ఉన్నదని శ్రీ మదోక్ అన్నారు.

బ్యాంకుల జాతీయం ఇప్పుడు జాతీయ విధానమని పార్టీ విధానం కాదని శ్రీగుజ్రాల్ అన్నారు. వివిధ పార్టీలకు చెందిన పార్లమెంటు సభ్యులను అభిప్రాయాలు వివరించడానికి పిలిపించిన వివరాలు తెలియ జేశారు.

జనసంఘం, స్వతంత్ర భావాలను ప్రకటించడం జరిగిందా అని శ్రీ మదోక్ అడిగారు.

ఆకాశవాణి ద్వారా ప్రసారం కోసం శ్రీ మదోక్ పార్టీ వారు ఏదయినా అభ్యర్థన చేశారా అని సమాచారశాఖ మంత్రి శ్రీసత్యనారాయణ సిన్హా అడిగారు.

బ్యాంకుల జాతీయానికి సంబంధించి ఆకాశవాణి వారు ఎవరిని ఆహ్వానించడం జరుగలేదన్నారు.

మంత్రి ప్రకటన తప్పు అని శ్రీ మదోక్ అన్నారు. తాముదానిని పరిశీలిస్తామని శ్రీసిన్హా అన్నారు.

కమ్యూనిస్టు, సి.ఎస్.పి. ఎస్. ఎస్. పి., లకు యిచ్చిన ప్రాతినిధ్యం విషయం శ్రీ ద్వివేది అడిగారు.

## ఏలూరు వద్ద తమ్మిలేరు వరద తాకిడి

ఏలూరు, ఆగస్టు 8: తమ్మిలేరు నది పొంగి, ఏలూరు సమీపంలో ఎడమగట్టుపై పొర్లడంవలన, ఈ మధ్యనే నాట్లు పడిన సుమారు 700 ఎకరాలు నీటిలో మునిగి పోయినవి. ఏలూరులోని తంగెళ్ళమూడిలో కొన్నిప్రాంతాలు జలమయమైనాయి. (స్వ.వి.)




## బ్యాంకుల జాతీయం

### ఢిల్లీ హైకోర్టులో రిట్ దరఖాస్తు కొట్టివేత

న్యూఢిల్లీ, ఆగస్టు 8: క్రితం నెల 14 పెద్దబ్యాంకులను జాతీయం చేస్తూ ప్రభుత్వం జారీచేసిన ఆర్డినెన్సు రాజ్యాంగవిరుద్ధము, చెల్లదని అంటూ, మాజీ ఐ. సి. ఎస్. ఆఫీసర్ శ్రీ ఆర్. పి. కపూర్ దాఖలు చేసిన రిట్ దరఖాస్తుపై ప్రాథమిక విచారణ జరిపిన అనంతరం ఢిల్లీ హైకోర్టు నేడు కొట్టి వేసింది.

ప్రధానమంత్రి తన మంత్రిమండలిలోని మంత్రులను సంప్రదించకుండానే బ్యాంకులను జాతీయం చేస్తూ ఆర్డినెన్సు జారీచేయాలని అప్పటి తాత్కాలిక రాష్ట్రపతి శ్రీ వి.వి. గిరికి సలహా ఇచ్చిందని ఆర్డినెన్సు చెల్లదని దరఖాస్తుదారు వాదించారు.

హైకోర్టు డివిజన బెంచి ఈ వాదాన్ని త్రోసిపుచ్చి రిట్ కొట్టివేసింది.

# అరాజక శక్తుల రూపుమాపాలి

## కొత్తగూడెం సన్మాన సభలో మంత్రి శ్రీ వెంగళరావు ఉద్ఘాటన

కొత్తగూడెం, ఆగస్టు 8: ఆంధ్రప్రదేశ్ ప్రజల ముందున్నది తెలంగాణా—ఆంధ్ర అన్నది సమస్యకాదు శాంతి భద్రతల సమస్య అని అంతరంగిక వ్యవహారాల మంత్రి శ్రీ జలగం వెంగళరావు అన్నారు.

రామచంద్రా ఆడిటోరియం హాలులో ఆయనకు జరిపిన సన్మానం సందర్భంగా ఆయన ప్రసంగించారు.

ఆందోళన పేరుతో శాంతికి భంగం వాటిల్లుతున్న గూండాలను రవుడీలను ఎదుర్కొని వారి ఆటలు అరికట్టడం సమస్యగా శ్రీ వెంగళరావు పేర్కొన్నారు. బాధ్యతల నుండి వైదొలగడం ద్వారా యీ బెదదను ఎదుర్కొనలేమన్నారు.

కొద్దిమంది శాసన సభ్యులు రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన విధించాలని కోరుతున్నందున శాసనసభలోని కాంగ్రెసు పార్టీ అధిక సంఖ్యాకుల అభిప్రాయాన్ని త్రోసిపుచ్చరాదని శ్రీ కామరాజ్ శ్రీ నిజలింగప్పలకు తాము చెప్పామన్నారు.

ప్రజాస్వామ్య పరిరక్షణకు అరాజక శక్తుల తుడిచి పెట్ట వలసిఉందన్నారు. ఆ ఉద్దేశ్యంతోనే తాము బాధ్యతల స్వీకరించామని హర్షధ్వానాల మధ్య ఆయన పేర్కొన్నారు. ఇది రాష్ట్రానికి పరీక్షా సమయమన్న అభిప్రాయాన్ని ఆయన వ్యక్త పరచారు.

దేశ సార్వభౌమత్వానికే ముప్పు తెచ్చి పెట్టే స్థితిలో ఉన్నాయని పార్లమెంటు సభ్యుడు శ్రీ కోట పున్నయ్య పేర్కొన్నారు.

శ్రీ పానుగంటి పిచ్చయ్య ఎం. ఎల్. ఎ. అధ్యక్షత వహించారు.

సమితి అధ్యక్షుడు శ్రీ చేకూరి కాశయ్య, ఎల్లెందు సమితి అధ్యక్షుడు శ్రీ సుగ్గల సత్యనారాయణ శ్రీ కె. వెంకటేశ్వర్లు తదితరులు ప్రసంగించారు.

పట్టణ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ సంబాని వెంకటేశం స్వాగతం చెప్పారు.

సింగరేణి బొగ్గు గనుల డిప్యూటీ జనరల్ మేనేజర్ శ్రీ కె. వి. సుబ్బయ్య డివిజనల్ పర్సనల్ అధికారి ఎన్. సోమరాజులు సభకు హాజరయినారు.

## కోహిమాలో బాంబు ప్రేలుళ్లు

కోహిమా, ఆగస్టు 8: రాజభవన్ సమీపంలో నిన్న సాయంకాలం బాంబు ప్రేలుళ్లు వెన్వెంటనే అనేకసార్లు జరగడంతో కోహిమా పట్టణం దద్దరిల్లి పోయింది.

ఆ తర్వాత పోలీసులు మైకులు ఉన్న వ్యానులలో పట్టణంలో తిరిగి రాజభవన్ సమీపంలోమొన్న దొరికిన బాంబులను ప్రేల్చి వేయడం జరిగిందని, ఈ బాంబులు రెండవ ప్రపంచ యుద్ధం కాలం నాటివని, మొత్తం 36 బాంబులు లభించాయని తెలిపారు.



# తుఫానులో దెబ్బతిన్న ధాన్యం: మిల్లర్ల, రైతుల ఇబ్బందుల వివరణ

విజయవాడ, ఆగస్టు 8: నిన్న సాయంత్రం డెల్టా జిల్లాల కలెక్టర్లు ఆయా జిల్లాల బియ్యం మిల్లర్లను విడివిడిగా కలుసుకొని ఇబ్బందులను విన్నారు. ఇటీవలి తుఫాను వరదలకు దెబ్బతిన్న ధాన్యపంట బియ్యం వారివద్ద ఎంత ఉందో అడిగి తెలుసుకున్నారు.

### పశ్చిమ గోదావరి మిల్లర్లు

పశ్చిమ గోదావరిజిల్లా మిల్లర్లు తమ ఇబ్బందులు వివరిస్తూ దెబ్బతిన్న ధాన్యపు తాలూకు బియ్యంలో అంగీకారమైన నూకల శాతం పరిధి 5 నుండి 8 వరకు పెంచాలని, ఉప్పుడు బియ్యం రంగు పోవటం పరిధి 20 శాతం కాక 30 శాతంకు అంగీకరించాలని పచ్చిబియ్యంలో మాత్రంఅది ఇప్పుడు అంగీకరింపబడుతున్న 10 శాతం కాక 20 శాతం వరకు పెంచాలన్నారు.

ఇందుకు రెవెన్యూ బోర్డు మొదటి సభ్యులు సివిల్ సప్లయిస్ కమిషనరు శ్రీ గురుస్వామి సాధ్యంకాదని సమాధానం చెప్పారు.

ఇదివరలో ఒక క్వింటాలు నూకలు మన రాష్ట్రంలోనే జోన్ దాటి ఎగుమతి చేయాలంటే పర్మిట్‌కు 1 రూపాయి వసూలు చేసేవారు. దీన్ని ఇటీవల రు. 2.50 లకు పెంచటం జరిగింది. ఇదివరకటి 1 రూపాయి మాత్రమే ఉంచాలనీ పెంచకూడదని మిల్లర్లు వాదించారు.

ఈ కోరికను పరిశీలించగలం అని మాత్రం శ్రీ గురుస్వామి చెప్పారు.

అమ్మకంపన్నువిషయంలోఅన్నిజిల్లాల మిల్లర్లు మనవి చేశారు. రెండు సంవత్సరాలుగా ఇది ఒక ఆందోళనకర సమస్యగా పరిణమించింది. దీన్ని వెంటనే పరిష్కరించాలని కోరారు.

### కృష్ణాజిల్లా రైతులు

కృష్ణాజిల్లా రైతులు తమ ఇబ్బందులను వివరిస్తూ తమవద్ద ఆహార వాణిజ్య కార్పొరేషన్ వారు ఆహారించని దెబ్బతిన్న ధాన్యం బియ్యం పేరుకొన్నదని ఉన్నాయని వాటిని వెంటనే సేకరించే ఏర్పాట్లు చేయాలని కోరారు. తమ వద్ద నిల్వలు ఉన్నాయని మిల్లర్లు సుమారు [illegible] ఆహార వాణిజ్య కార్పొరేషన్‌వారు ఆహారించని బియ్యం [illegible] టన్నులు. వారు ఆహారించని బియ్యం [illegible] టన్నులు ఉన్నాయని వివరించారు.

గుంటూరు జిల్లాలో అమలులో ఉన్నట్లు ఆహార వాణిజ్య కార్పొరేషన్ సేకరించే పద్ధతి తాలూకు బియ్యం అందజేయడానికి సదుపాయాలు [illegible] పంటతాలూకు బియ్యం విషయంలో దార్లకు [illegible] చేయటానికిగాను ప్రోత్సాహం లభింపజేయాలని కోరారు. గుంటూరుజిల్లాలో మిల్లర్లు ఒక్క వాగన్ బియ్యం ఆహార వాణిజ్యకార్పొరేషన్ జిల్లా మార్కెటింగ్ సొసైటీకి ఇస్తే 3 వాగన్ల బియ్యం రాష్ట్రంలో జోను దాటి ఎగుమతి చేసుకోటానికి అవకాశం ఉంది.

ఈ కోరికను శ్రీ గురుస్వామి పరిశీలించగలమని వాగ్దానం చేశారు.

### తూర్పు గోదావరి మిల్లర్లు

తూర్పు గోదావరిజిల్లా మిల్లర్ల సమస్యలు కొత్త రకంగా ఉన్నాయి. జిల్లాలోతగినంత ధాన్యంధాన్యమేలేదుకాబట్టితూర్పుకున్నదెబ్బతిన్న ధాన్యాన్ని వారు పచ్చి బియ్యంగా మార్చలేకపోతున్నారు. ఉప్పుడు బియ్యం మిల్లులు ఆ జిల్లాలో లేనేలేవు. ఈ సందర్భంలో పశ్చిమ గోదావరి జిల్లా కలెక్టరు ఒక సరిక్రొత్త సూచన చేశారు.

తూర్పు గోదావరి జిల్లాలో ఉన్న దెబ్బతిన్న దాళ్వా ధాన్యాన్ని పశ్చిమ గోదావరి జిల్లాలోని మిల్లులలో ఉప్పుడు బియ్యంగా మార్పు చేసుకుని తూర్పు గోదావరి లెక్కకే జమకట్టుకోవచ్చునని పశ్చిమ గోదావరిజిల్లా కలెక్టరు సూచించారు.

అయితే ఈ సూచనను తూర్పు గోదావరి జిల్లా మిల్లర్లు అంగీకరించలేదు. అనవసరంగా అధిక శ్రమ అవుతుందని రవాణా ఖర్చులు కూడా విపరీతంగా పెరుగుతాయని వీరు వాదించారు.

ఈ ఉదయం కెనాల్ అతిథి గృహంలో జరిగిన డెల్టా కలెక్టర్ల సమావేశానికి సివిల్ సప్లయిస్ కమిషనరు శ్రీ గురుస్వామిఅసిస్టెంట్ కమిషనర్ శ్రీ నకీం, కృష్ణాజిల్లా కలెక్టరు శ్రీ సి.ఎస్. శాస్త్రి, డి.ఆర్.ఒ. శ్రీ బి.వి. రామారావు, శిక్షణ పొందుతున్న అసిస్టెంట్ కలెక్టరు శ్రీ కందా మోహన్, డి.ఎస్.ఒ. శ్రీ మునిరత్నం, గుంటూరుజిల్లా కలెక్టరు శ్రీ శ్రీ వెంకటరత్నం, పశ్చిమ గోదావరిజిల్లా కలెక్టరు శ్రీ కె. సుబ్రహ్మణ్యం, తూర్పు గోదావరిజిల్లా డి.ఆర్.ఒ. శ్రీ కె. ఉమాపతి. నెల్లూరుజిల్లా డి.ఎస్.ఒ. గారలు హాజరైనారు.

## గిరి రాజీనామా పత్రాలు

### పరిశీలించనివ్వాలని కోర్టులో మసానీ దరఖాస్తు

న్యూఢిల్లీ, ఆగస్టు 8: ఉపరాష్ట్రపతి పదవికి శ్రీ వి. వి. గిరి రాజీనామాకు సంబంధించిన పత్రాలను పరిశీలించేందుకు వాటిని తెప్పించ వలసిందిగా పార్లమెంటు సభ్యుడు శ్రీ ఎం. ఆర్. మసానీ పెట్టుకున్న దరఖాస్తుపై 7వ తేదీన విచారణ జరపాలని సుప్రీం కోర్టు నిన్న నిర్ణయించుకున్నది.

మాజీ కేంద్ర మంత్రి శ్రీ ఎం. సి. చాగ్లా దరఖాస్తుదారుని తరఫున హాజరవుతూ, ఈ పత్రాలు "చాలా అవసరమైనవ"ని, 14 బ్యాంకులను జాతీయం చేస్తూ జారీ అయిన ఆర్డినెన్సు రాజ్యాంగరీత్యాచెల్లదని పేర్కొంటూ ఇదివరకు దాఖలు అయిన ఒక రిట్ దరఖాస్తులో తాము ప్రస్తావించిన ఒక ముఖ్యమైన అంశాన్ని రుజువు చేయడానికిదని అవసరమనీ తెల్పారు. ఆ రిట్ దరఖాస్తుపై ఆగస్టు 11 తేదీన విచారణజరుగవలసి ఉన్నది.

# బొంబాయి హంతకుని విచిత్ర వాంఛలు

బొంబాయి, ఆగస్టు 8: ఒక సంవత్సరంపాటు బెయిలు, మరి కొన్ని ఇతర సదుపాయాలు కలుగజేసినట్లయితే, తను మద్రాసులో నేరస్థుడుగా 20 సంవత్సరాలపాటు గడిపిన జీవితాన్ని, బొంబాయిలో చేసిన 40 హత్యల వెనుకగల రహస్యాన్ని వెల్లడించగలనని, రామన్ రాఘవ నిన్న సెషన్సు కోర్టులో చెప్పాడు.

ఉత్తర బొంబాయిలోని మలాడ్‌లో గత ఆగస్టులో రెండు హత్యలు తాను చేసిన మాట నిజమేనని అంగీకరిస్తూ, ఈ బెయిలు కాలంలో మాత్రం తాను హత్యలుగాని, దొంగతనాలుగాని చేయబోనని అతను సెషన్సు కోర్టుకు హామీ యిచ్చాడు.

బెయిలు కాక అతను కోరిన ఇతర సదుపాయాలివి: "లైంగిక సంపర్కం కోసం ఒక స్త్రీ, ఆమెను చూసుకోటానికి 75 సంవత్సరాల వయస్సుంచే ఒక మహిళ, ఒక పోలీసు ఇన్‌స్పెక్టర్ ఇద్దరు కానిస్టేబుల్స్, ఒక సాయుధ పోలీసు, ఒక బట్లరు, ఒక జీపు, చాలినంత డబ్బు, దేశంలో అన్ని ప్రాంతాలకు వెళ్లడానికి రైల్వే పాస్.

తాను చేసిననేరం వివరాలన్నీ సేకరించిన తర్వాత, తనకు విధించబడిన శిక్షను ప్రపంచం నిర్ణయానికి వదిలివేయాలని రామన్‌రాఘవ్ కోరాడు.

తనకు లైంగిక సంపర్కంకోసం అప్పగించే స్త్రీని బెయిల్‌కాలం ముగిసిన తర్వాత తిరిగి అప్పగించడానికి అతను అంగీకరించాడు.

అంతకు ముందు కోర్టు ప్రశ్నలకు జవాబిస్తూ, ప్రాసిక్యూషన్ సాక్షులు చెప్పిన సాక్ష్యంలో కొన్నింటిని రామన్ రాఘవ్ ఖండించాడు. గుర్తింపుకోసం తనను కొంతమంది మధ్య నిలబెట్టి చూపినప్పుడుఇద్దరు తనను గుర్తించిన మాట నిజమేనని, అయితే వారు అసలు తననెప్పుడైనా చూశారా అన్నది తన సందేహమని అతను అన్నాడు.

తనచేత తప్పుచెప్పించడానికి పోలీసులు తనను అవమానించారని అతను చెప్పాడు.

తాను ఒక పొదలో దాచి వుంచిన ఆయుధాలను అతను గుర్తించాడు. అయితే తనకు చూపబడిన ఆ ఫోటో ఛాయా చిత్రం చాలా అస్పష్టంగా వున్నదని అతను అన్నాడు.

ముద్దాయి తరపు సాక్ష్యులను హాజరు పరచడానికి వ్యవధి కావాలని ముద్దాయి తరపు న్యాయవాది కోరగా అప్పుడు విచారణ వాయిదా పడింది.

## విదేశీ యాత్రపై 'పి' ఫారం కంట్రోల్ రద్దు చేయాలన్న సూచనకు ప్రభుత్వ తిరస్కృతి

న్యూఢిల్లీ, ఆగస్టు 8: విదేశీయాత్రలకు సంబంధించి "పి" ఫారం కంట్రోలును రద్దు చేయాలని పరిపాలనా సంస్కరణల సంఘం చేసిన సిఫార్సును కేంద్రప్రభుత్వం తిరస్కరించింది.

"అర్థికపరిస్థితిపై" పరిపాలనా సంస్కరణల సంఘం నివేదిక మీద ప్రభుత్వ నిర్ణయాలను తెల్పుతూ, ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ నేడు లోక్‌సభకు ఒక పత్రాన్ని సమర్పించారు.

"పి" ఫారం కంట్రోలు [illegible] పరిపాలనా సంస్కరణల సంఘం సిఫార్సును ఎందుకు తిరస్కరించవలసి వచ్చిందో వివరిస్తూ, విదేశీ ద్రవ్యం కొరత పరిస్థితి ఇంకా నడుస్తూనే ఉన్నదని, అందువల్ల విదేశీయాత్రలపై అన్ని రకాల కంట్రోళ్ళను పూర్తిగా ఎత్తివేయడం సాధ్యం కాదని ప్రభుత్వం తెలియజేసింది.

ఎగుమతుల ప్రోత్సాహం విషయంలో పరిపాలనా సంస్కరణల సంఘం సిఫార్సులను ప్రభుత్వం ఆమోదించింది. ఎగుమతి స్థాయిని సంస్థల గుర్తింపును అధికారికంగా పరిశీలించే [illegible]. అయితే ఆ గుర్తింపునకుగల ప్రాతిపదికను సవరించవచ్చు. పథకాలను సమీక్షించిన అనంతరం దానిని కొనసాగించాలని సంఘం సిఫార్సు చేసింది. ఎగుమతి వ్యాపారసంస్థలు ఉన్నతప్రమాణాలతో పని విధానాలను పాటించిందీ లేనిదీ తెలుసుకొనడమే ఆ సమీక్ష లక్ష్యం అవుతుంది.

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press Gandhinagar, Vijayawada-3. Editor: S. Sambhu Prasad. Phone: Vijayawada 5667, 5226.

